# అథ గోదానాది దశ దాన శ్లోకాః

**శ్లో॥ గో భూ తిల హిరణ్య ఆజ్య వాసో ధాన్య గుడానిచ।**
**రౌప్యం లవణ మిత్యాహుర్దశ దానాః ప్రకీర్తితాః॥**

దూడతో కూడుకున్న ఆవున్నూ, భూమి, నువ్వులు, బంగారము, ఆవునెయ్యి, వస్త్రములు, ధాన్యము, బెల్లము, వెండి, ఉప్పు ఈ పదిన్నీ దశదానములని ప్రసిద్ధికెక్కినవి.



### 1.స్వర్గలోక ప్రాప్తి కల్గించు గోదానము

**శ్లో॥ గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ।**
**తస్మాదస్యాః ప్రదానేన ప్రియతాం కమలాపతిః॥**

గోవుయొక్క అంగములందు పదునాలుగు లోకములూ కలవు. అట్టి గోదానము చేయుటవల్ల విష్ణుమూర్తి ప్రీతిచెందును. దూడతోకూడుకున్నదీ, పాలిచ్చునదీ, బంగారపు కొమ్ములునూ, వెండిడెక్కలు, కంచుమూపురము, రాగి తోక, పాలుపితుకుటకుపాత్ర, వస్త్రాదులచేత అలంకరింపబడిన, శ్రేష్ఠమైన గోవును ఫలముతోకూడుకున్న దక్షిణ, తాంబూలాదులతోకూడ గోదానవిధిగా దానము చేయవలెను.-ఈ దానముగూర్చి శక్తియుండియూ ద్రవ్యలోపము చేయరాదు.

### 2.శివ లోక ప్రాప్తి కల్గించు భూ దానము

**శ్లో॥ సర్వసస్యాశ్రయా భూమి ర్వరాహేణ సముద్ధృతా।**
**అనంత పుణ్య ఫలదా శాశ్వతైశ్వర్యదా సదా॥**
**తస్మాదస్యాః ప్రదానేన ప్రియతాం గిరిజాపతిః॥**

వరాహస్వామిచే ఉద్ధరించబడిన, సుక్షేత్రమైన సమస్త సస్యములూ ఫలించుభూమిని దానముచేయుటవలన అనంతపుణ్య ఫలము శాశ్వత మైన సంపద కలిగి, శంకరునకు ప్రీతిని కలిగించును.

### 3.విష్ణులోక ప్రాప్తికల్గించు తిలదానము

**శ్లో॥ తిలాః పాపహరా నిత్యం విష్ణోర్దేహ సముద్భవా।**
**తిలాదాన ప్రదానేన పాపంనుద రమాపతే॥**

విష్ణుదేవుని శరీరమునుంచిపుట్టిన నువ్వులను దానము చేయుట వలన శ్రీమహావిష్ణువు సమస్త పాపములనూ పోగొట్టును.

### 4.అగ్నిలోక ప్రాప్తికల్గించు హిరణ్యదానము

**శ్లో॥ హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః।**
**తస్మాదస్యప్రదానేన అగ్నే పాపం వ్యపోహయ॥**

బ్రహ్మగర్భమునుంచి పుట్టిన బంగారమును దానముచేయుట వలన అగ్నిదేవుడు సమస్త పాపములనూ నశింపచేయును.

### 5.ఇన్ద్రలోక ప్రాప్తికల్గించు ఆజ్యదానము

**శ్లో॥ కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషు సంస్థితమ్।**
**దేవానామాజ్యమాహారం శక్రపాపం సుదాశుమే॥**

కామధేనువునుండి ఉత్పత్తిచేయబడిన నేతిని యజ్ఞాదుల యందు దేవతలకు ఆహార ముగా ఇచ్చెదరు. అట్టి నేతిని దానము చేయుటవలన ఇంద్రుడు ప్రీతిచెంది సమస్త పాపములనూ పోగొట్టును.

### 6. సకల దేవతలకూ ప్రీతికల్గించు వస్త్రదానము

**శ్లో॥ శీత వాతోష్ణ సంత్రాణాం లజ్జాయా లక్షణం పరం।**
**దేహాలంకరణం వస్త్రం సర్వపాపహరం శుభం।**

తస్మాద్వస్త్ర ప్రదానేన శుభం యచ్ఛన్తు వై సురాః ॥

శరీరమును వేడినుండి, చలినుండి మరియూ సిగ్గునుండి కాపాడుటకునూ, అలంకారముగనూఉండు వస్త్రములను దానము చేయుటవలన సర్వదేవతలూ ప్రీతిచెంది దాతకు పాపములను పోగొట్టి శుభములను కలుగజేయుదురు.

### 7.ఇన్ద్రా దిలోక ప్రాప్తికల్గించు ధాన్యదానము

శ్లో॥ ధన్యం కరోతి దాతార మిహలోకే పరత్రచ।
సంపూర్ణ ధాన్య శకట దానాన్మోక్ష ప్రదం శుభమ్।
తస్మాద్ధాన్య ప్రదానేన ప్రియతాం లోక నాయకాః ॥

ఒక బండిధాన్యము దానముచేయుటవలన దిక్పాలకులు సంప్రీతిచెంది దాతకు ఇహలోకమునందు సమస్త సుఖములనూ, పర మందు మోక్షమునూ కలుగచేయుదురు.

### 8. లక్ష్మీ ప్రాప్తికల్గించు గుడదానము

శ్లో॥ రుచ్యోరసానాం ప్రవర స్వఏవేక్షు రసోత్తమః।
మమతస్మాత్పరాం లక్ష్మీం దదాతు గుడ సంజ్ఞక ॥

చెరుకురసమునుండి ఉత్పన్నమై, రుచులలో ఉత్తమమైనదిగా వాసి కెక్కిన బెల్లమును దానముచేయుటవలన లక్ష్మీదేవి సంప్రీతిచెంది దాతకు సర్వ సంపదల నిచ్చును.

### 9. పితృప్రీతి కల్గించు రౌప్య (రజత) దానము

శ్లో॥ పితౄణాం వల్లభం యస్మా ద్విష్ణోర్వై శంకరస్యచ।
రజతం పాహినస్తస్మా దుఃఖ సంసార సాగరాత్।
తస్మాద్రజత దానేన తృప్యంతు పితరస్సదా ॥

అగ్నిదేవుని కన్నీటినుండి ఉత్పన్నమైన వెండిని దానము చేయుట శివకేశవులు మరియూ పితృదేవతలు సంప్రీతిచెంది దాతకు వంశా భి సమస్త సంపదలిచ్చెదరు.

### 10.వరుణలోక ప్రాప్తికల్గించు లవణదానము

శ్లో॥ రసానా మగ్రజం శ్రేష్ఠం లవణం బలవర్ధనం।
ఆయుఃప్రీతిపదం నిత్య మతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥
తస్మాదస్యాః ప్రదానేన ప్రియతాం మృత్యుదేవతా ॥

రుచులలో ఉత్తమోత్తమమైన ఉప్పును దానముచేయుట మృత్యుదేవత సంతృప్తి చెంది దాతకు ఆయుర్దాయమునూ, బలమునూ ప్ర కలుగజేయును.

ఇతి దశదానాని.

# ఉపసంహారమ్

తతః పునస్సంకల్ప్య । వ్రతసాంగతా సిద్ధ్యర్థంబ్రాహ్మణేభ్యః గో దానాది దశదానాని, షోడశ మహాదానాని యథావిభవందత్వా ఇతరేభ్యః దక్షిణాని దత్వా సువాసినీభ్యః వాయనదానానిచదత్వా । కలశాన్ పునః ఉపచారైః స్సంపూజ్య । ప్రధాన కలశ, వస్త్ర ప్రతిమాదిద్రవ్యాణి ఆచార్యాయ దానమంత్రేణ దత్వా ఆచార్యం పత్న్యాసహ దంపతీ పూజయా సత్కృత్య । తదనన్తరం బ్రాహ్మణాన్ భోజయిత్వా తాంబూలానన్తరం ఆశిషోవాచయిత్వా । పుత్రమిత్ర కళత్రాద్యైస్సహ స్వయం భుంజీత ॥

పూర్ణాహుతి తరువాత మరల సంకల్పముచేసి వ్రతసంపూర్తి కొరకు బ్రాహ్మణులకు గోదానాది దశదానములూ, షోడశమహాదానములను శక్తిలోపములేకుండా వీలయినంత ఎక్కువగాచేసి, ఇతర బ్రాహ్మణుల కు యథాశక్తిగా దక్షిణలనిచ్చి, ముత్తయిదువులకు వాయన దానములిచ్చి, తదుపరి ప్రధానకలశ, వస్త్ర ప్రతిమలతో కూడిన మంటపములకు మరల పూజచేసి, ఉద్వాసన చెప్పి,ఆమంటపములన్నింటినీ బ్రహ్మగార్కి దానము చేసి, ఆచార్యుని దంపతీయుక్తముగా సత్కరించి, బ్రాహ్మణులను భుజింప చేసి, తాంబూలములిచ్చినపిదపవారి ఆశీర్వచనములనుపొంది, భార్యా పుత్రుల తోనూ, బంధుమిత్రులతోనూ కలసిభుజించవలెను. ముందుగా గోదానాది దశదానములకూ, షోడశమహాదానములకూ సంకల్పము చేయవలెను.

# దానవిధిః

ఆచమ్య .......ప్రీత్యర్థం మయాచరిత ఋషిపంచమీ / లక్షవర్తి వ్రత సాద్గుణ్యార్థం గోదానాది దశదాన సహిత షోడశ మహాదానిచ కరిష్యే ॥

ఆదౌ ప్రథమతః గోదానం కరిష్యే । తదంగ గోపూజాం కరిష్యే । కృత్వా॥

ఆచమించిన తరువాత నాచే అచరింపబడిన ఈ ఋషిపంచమీ/ లక్షవర్తీ వ్రతముల సంపూర్తిచెందుటకొరకు గోదానము మొదలగు దశ దానములనూ, షోడశ మహాదానములను చేయుచున్నాను. ముందుగా గోదానమును చేయుచున్నాను అనిసంకల్పించి, తదుపరి గోపూజను చేయవలెను. పిమ్మట దానము ఏబ్రాహ్మణునకు ఇవ్వదలచి నామో వారిని ఆసనముపై కూర్చుండజేసి క్రిందవిధముగా పూజించి దానమీయ వలెను.

శ్రీమహావిష్ణు స్వరూపిణం బ్రాహ్మణముపకల్పయామి ।

దానమివ్వదలచిన బ్రాహ్మణుని ఆసనముపై కూర్చుండజేసి వారి శిరస్సుపై అక్షతలుంచవలెను.

ఉపకల్పితోస్మిః ॥ ఉభాభ్యామిదం వాం పాద్యమ్ ॥

పిమ్మట వారి పాదములను కడుగ (సాక్షతోదకమును చల్లు) వలెను.

శ్లో ॥ నమోస్త్వనన్తాయ సహస్రమూర్తయే సహస్ర పాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః ॥

పిమ్మట వార్కి గంధాక్షతలుఇవ్వవలెను.

భాగశః అమీవో గన్ధాః । సుగన్ధాః । అలంకారార్థా ఇమే అక్షతాః । సన్త్వక్షతాః । సకలారాధనైః స్వర్చితమస్తు ॥

తరువాత దానముపుచ్చుకొనువారు తమ వేద శాఖ, గోత్రనామముల నుచ్చరించవలెను. అస్మై బ్రాహ్మణాయ .......శ్శాఖాధ్యాయినే ......గోత్రాయ ......శర్మ బ్రాహ్మణాయ తరువాత దాత గోత్రనామములను ఉచ్చరించి సాక్షతోదక పూర్వకముగా దానమును ఇవ్వవలెను.

ప్రతిగ్రహీత్రే ......గోత్రవత్యాః .......నామధేయవత్యాః ఆచరిత ఋషిపంచమీ / లక్షవర్తీ వ్రత కల్పోక్త సమ్పూర్ణ సకల ఫలావాప్త్యర్థం । గోదానం తుభ్యమహం సంప్రదదే నమమ॥ పిమ్మట యధాశక్తిగా దక్షిణను కూడా ఇవ్వవలెను.ఏతద్దాన సాద్గుణ్యార్థం మనస్సంకల్ప దక్షిణాం తుభ్యమహం సంప్రదదే నమమ ॥

ఇదే విధముగా మిగిలినఅన్నిదానములనూ చేయవలెను.

# అథ షోడశ మహాదాన శ్లోకాః

శ్లో॥ కన్యా కనక దాసీచ శకటాశ్వ గజాగృహమ్।
లాంగలం కాలపురుషం కాలచక్రం తథాక్షితిః॥
మేషశ్చ మహిషీచైవ శయ్యాచోభయతోముఖీ।
తిలపర్వత విజ్ఞేయా మహాదానాని షోడశ॥

కన్య, బంగారము, దాసీ, బండి, గుఱ్ఱము, ఏనుగు, ఇల్లు, నాగలి, కాలపురుషుడు, కాలచక్రము, భూమి, మేక, గేదె, మంచము, ఉభయముఖీ గోదానము, తిలపర్వతము ఈ16షోడశ మహాదానములని చెప్పబడును.

### 1. బ్రహ్మ, విష్ణు లోక ప్రాప్తి కల్గించు కన్యాదానము



శ్లో॥ కన్యాం కనక సంపన్నాం కనకాభరణైర్యుతామ్।
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా।
కన్యే మమాగ్రతో భూయాః కన్యేమే దేవి పార్శ్వయోః।
కన్యేమే సర్వతో భూయాస్త్వద్దానాన్మోక్షమాప్నుయా।
విశ్వంభర స్సర్వభూతా స్సాక్షిణ్య స్సర్వదేవతాః।
ఇమాం కన్యాం ప్రదాస్యామి పితౄణాం తారణాయవై।
కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే।
ప్రయతోహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ సిద్ధయే॥

బంగారముతో కూడినదీ, బంగారు ఆభరణములచే అలంకరింపబడినదీఅగు కన్యకను విష్ణురూపుడైన నీకుఇచ్చుచున్నాను. నేను బ్రహ్మలోకమునుపొందుటకై సాక్షాల్లక్ష్మీ స్వరూపిణియైన ఈకన్యను దానము చేయుటచే నేను, నాపితృదేవతలూ తరించెదమనియూ, మోక్ష మును పొందెదమనియూ, విశ్వాత్మకుడైన పరమాత్ముడూ, పంచభూత ములు సర్వదేవతల సాక్షిగా ధర్మ-అర్థ-కామములు సిద్ధించుటకై ఈమె ను నీకు దానము చేయుచున్నాను. ఈమె సర్వాలంకార సంయుత, మంచిశీలము, సుగుణ, శుభలక్షణములు కలది అనిదాత పైవాక్యముల ను పలుకును. ఈకన్యాదానమును చేయుటవలన దాతయొక్క తండ్రి, తాత, ముత్తాత, మొదలగువారు పదితరములూ. దాత, కుమారుడు, మనుమడు మునిమనుమడు మొదలగువారు పదకొండుతరములూ వెరశి ఇరువదిఒక్క తరములవార్లు శాశ్వతమైన బ్రహ్మపదమును పొందెదరు.

### 2. విష్ణులోక ప్రాప్తికల్గించు హిరణ్యదానము



శ్లో॥ సువర్ణం సర్వ పాపఘ్నం మేరు పర్వత సంభవమ్।
తస్యదానేనమే పాప శాన్తిరస్తు రమాపతే॥

మేరుపర్వతమునుండి పుట్టినదీ, సర్వపాపములను పోగొట్టునదీ ఐన బంగారమును దానము చేయుటవలన శ్రీమహావిష్ణువు సంతృప్తి చెంది పాపశాన్తి కలుగజేయును.

### 3.ఐశ్వర్య ప్రాప్తికల్గించు దాసీదానము



శ్లో॥ దాసీయం ప్రత్యహం గేహే మార్జనాది క్రియాకరీ।
సంప్రదాయేన చైవస్యా స్సుఖసంపత్వదాస్తుమే॥

ప్రతినిత్యమూ గృహమందు యజమానికి కావలసిన సమస్త పనులనూ

(ఊడ్చుట, కళ్ళాపిచల్లుట మొ॥వి) చేయు దాసీని సంప్రదాయ ప్రకారము దానము చేయుటవలన ఎల్లవేళలా దాత సుఖసంపదలు పొందును.

### 4. విష్ణులోక ప్రాప్తికల్గించు శకటదానము



శ్లో॥ **శకటం సర్వ దైవత్యం భారీ ధాన్య సమన్వితమ్।**
**విష్ణు ప్రియకరం పాప శాన్తిరస్తు రమాపతే॥**

సకలదేవతాస్వరూపమై విష్ణు ప్రీతికరమైన, భారీధాన్యముతో కూడిన, బండిని దానము చేయుటవలన శ్రీమహావిష్ణువు ప్రీతిచెంది, పాపశాన్తి కలుగజేయును.

### 5.గన్ధర్వలోక ప్రాప్తి కల్గించు అశ్వ దానము



శ్లో॥ **అశ్వోహి వాహనం భానోః కారణంహి శతక్రతోః।**
**అశ్వదానేన గంధర్వ లోకప్రాప్తి స్సదాస్తుమే॥**

ఇంద్రప్రీతికరము, సూర్యవాహనము అయిన గుర్రమును దానము చేయుటవలన గంధర్వలోకప్రాప్తిని కలుగును.

### 6. శివలోక ప్రాప్తికల్గించు గజదానము



శ్లో॥ **ఐరావత చతుర్దంత గజానాం నాయకోహ్యపి।**
**దిగ్దంతీనాం పూజ్యతమో పాపం క్షపయితుం ప్రభుః।**
**సుప్రతీక గజేంద్రత్వం సరస్వత్యాభిషేచితః।**
**ఇన్ద్రస్య వాహన శ్రేష్ఠ స్సర్వ దేవసు పూజితః।**
**గజేన్ద్రమత్తమాతంగ రిపుసైన్య వినాశక।**
**తవదానేన మే పాపంనుద శంకర కింకర॥**

క్షీరసాగరమధనమపుడు పుట్టిన ఏనుగుకు ఐరావతమనుపేరు. ఈఏన తెల్లనిదీ, నాలుగు దంతములుకలిగి ఇంద్రుని వాహనమై దిగ్గజములకు నాయ సర్వులకూ పూజనీయుడై సరస్వతిచే సుప్రతీక మనుపేరుచేత దిగ్గజమ అభిషేకించబడి శత్రుసైన్యవినాశకమైనది. అట్టి ఏనుగును దానము చేయుటవ శంకరుడుప్రీతిచెంది దాత సమస్త పాపములనూ పోగొట్టును.

### 7. సర్వదేవతా ప్రీతికల్గించు గృహదానము



శ్లో॥ **ఇదం గృహం గృహాణత్వం సర్వోపస్కర సంయుతం।**
**తేన దానేన మహతా మమసంతు మనోరథాః॥**

సర్వ సామాగ్రితో కూడిన గృహమును దానముచేయుటవలన దేవతలందరూ ప్రీతి చెంది దాత కోరికలన్నియూ తీర్చెదరు.

### 8. కృష్ణ ప్రీతికల్గించు లాంగలదానము



శ్లో ॥ బలరామ ప్రియకరం లాంగలం కృషి కారణం।
తస్మాల్లాంగల దానేన ప్రియతాం రుక్మిణీ పతిః ॥

బలరామునకు ప్రీతికరమైన ఆయుధం నాగలి. ఈనాగలి వ్యవసాయమునకు ముఖ్యమైనది. అట్టినాగలిని దానము చేయుటవలన రుక్మిణీ పతియైన శ్రీకృష్ణుడు సంతృప్తి చెందును.

### 9. ఈశాన లోక ప్రాప్తి కల్గించుకాలపురుష దానము



శ్లో ॥ మానుషాకృతినాస్యూతం నీలవస్త్ర సమన్వితమ్।
తిలైస్సంపూరితం చేత్వా త్వా కాలపురుషాకృతిః
తస్య దానేనమే సర్వ పాపశాంతిర్భవేత్సదా ॥

నీలవస్త్రమును ధరించి, మానుషాకృతికలిగిన కాలపురుష ప్రతిమను



నువ్వులు నింపిన పాత్రయందుంచి దానముచేయుటవల దాతయొక్కపాపములన్నియూ శాంతించును.

### 10. విష్ణు ప్రీతికరమైన కాలచక్రదానము



శ్లో ॥ కాలచక్రవశాద్దేవా నరాస్సంచరణ క్షమాః।
కాలచక్రప్రదానేన పాపశాంతిర్భవేద్ధరే ॥

కాలచక్రవశముచే దేవరాక్షస మానవులు చరించుచున్నారు అ కాలచక్రమును దానముచేయుటవలన విష్ణువు సంతృప్తిచెంది దాత యొక సమస్త పాపములనూ పోగొట్టును.

### 11. శివలోక ప్రాప్తికల్గించు భూదానము



శ్లో ॥ సర్వ సస్యాశ్రయాభూమి శ్శాశ్వత్తైశ్వర్యదాసదా।
తస్మాదస్యాః ప్రదానేన ప్రియతాం గిరిజా పతిః ॥

వరాహస్వామిచే ఉద్ధరించబడిన, సుక్షేత్రమైన సమస్త సస్యముల ఫలించుభూమిని దానముచేయుటవలన అనంతపుణ్య ఫలము శాశ్వత మై సంపద కలిగి, శంకరునకు ప్రీతిని కలిగించును.

## 12. శివ ప్రీతికరమైన మేషదానము



శ్లో ॥ అజోగ్నివాహో యజ్ఞాంగో బ్రహ్మణా నిర్మితః పురా।
అజదానేన మే పాపంనుద గౌరీపతేహర ॥

పూర్వము బ్రహ్మచే సృజించబడినదీ, యజ్ఞాంగమైనదీ అగ్నికి వాహనమైన మేకను దానముచేయుటవలన గౌరీపతియైన శివుడు సంతృప్తిచెంది దాతయొక్క సమస్త పాపములనూ హరించును.

## 13. యమ ప్రీతికరమైన మహిషీదానము



శ్లో ॥ మహిషీం వత్ససంయుక్తాం సుశీలాంచపయస్వినీం।
నీలవస్త్రావృతాంచాహం దాస్యేమృత్యు ప్రశాంతయే।
యమవాహస్య మహిషీం మృత్యురూపేణ సంస్థితాం।
సర్వమృత్యు హరాం నిత్యం దాస్యేమృత్యుంనుదాశుమే ॥

దూడతోకూడినదీ, సాధులక్షణములుకలదీ, బాగుగా పాలని చ్చునదీ, నల్లనివస్త్రములచే అలంకరించబడిన,గేదెను మృత్యుప్రశాన్తి కొరకు దానముచేయుచున్నాను. మృత్యురూపిణియై యమవాహనమైన గేదెను దానముచేయుటవలన దాతకు సర్వమృత్యుదోషములూ తొలగును.

## 14. కృష్ణ ప్రీతికరమై గోలోకప్రాప్తి కల్గించు శయ్యాదానము



శ్లో ॥ యథానకృష్ణ శయనం శూన్యం సాగర కన్యయా।
మమాప్యశూన్యా శయ్యాస్తు మమజన్మని జన్మని।
సుఖదం శయనం యస్మాత్కేశవస్య ప్రియం సదా।
దానేనానేన సౌభాగ్యం సర్వదాస్తు రమాపతే ॥

ఏ విధముగా శ్రీమహావిష్ణువునకూ, లక్ష్మీదేవికీ శయనము (మరణ
లేదో నాకుకూడా శూన్యశయనము (మరణము లేకుండుట ) సిద్ధించు
శయ్యాదానముచేయుటవలన రమాపతియైన విష్ణువు సంతోషించి, దా
సర్వదా సుఖసంపదలను ప్రసాదించును.

## 15. విష్ణులోక ప్రాప్తికల్గించు ఉభయతోముఖీ గోదానము



శ్లో ॥ సాలంకృతాం గృహాణేమాం దదామ్యుభయతో ముఖీమ్।
విష్ణురూప ద్విజశ్రేష్ఠ త్రాహిమాం భవసాగరాత్ ॥

గోవుప్రసవించుసమయమున దూడముఖము బయటకు
సమయమున గోవును దానముచేయుట ఉభయతోముఖీ గోదానమన బ
ఇట్టిదానముచేయుటవలన సంసార సాగరమునుండి దాత విముక్తుడగ

## 16. విష్ణులోక ప్రాప్తి కల్గించు తిలపర్వత దానము



శ్లో ॥ తిలపర్వత స్సవిజ్ఞేయో విష్ణుదేహ సముద్భవః।
తిలపర్వత దానేన పాపశాంతిర్భవేన్మమ॥

విష్ణు దేహమునుండి పుట్టిన నువ్వులను రాశిగాపోసి దానము చేయుట వలన దాతయొక్క సమస్తపాపములూ తొలగిపోవును.

